మన ప్రాంతమున ఆపస్తంబ సూత్రము ననుసరించి సంస్కారములు చేయుచుండుటచే దానికే అధిక ప్రాధాన్యమిచ్చి మిగిలిన సూత్రములలోని విశేషములను ఎడనెడ ప్రస్తావించితిని. భారతదేశపు నలుమూలల పదునెని మిది సూత్రములను పాటించుచున్నారు. ఇక దేశాచారములు లెక్కకు మిక్కిలి. ఉత్తరదేశపు టలవాట్లను తెలియవలెనన్నచో పారస్కరగృహ్యా సూత్రమును, ఋగ్వేదుల ఆచారములను గ్రహింపవలెనన్నచో ఆశ్వలాయన గృహ్యాసూత్రమును పరికింపవలెను. పాండేగారి హిందూ సంస్కార్ నుండి, భారత రత్న శ్రీ పి.వి. కాణేగారి ధర్మశాస్త్ర చరిత్ర నుండి పై రెంటి పద్ధతులను స్వీకరించితిని.

"రాగద్వేష విదగ్ధానాం అజ్ఞాన విషపాయినామ్
చికిత్సా ధర్మశాస్త్రాణి వ్యాధీనామివ భేషజమ్" -- శంఖలిఖితులు.

తా:- రాగద్వేషములచే బాధపడువారికి, అజ్ఞానమనెడి విషము త్రాగు వారికి, వ్యాధులచే బాధపడువారికి ఔషధమువలె ధర్మశాస్త్రముపకరించును.

ధర్మః సంసేవితః శుద్ధస్త్రాయతే మహతో భయాత్
శ్రుత్వాపి సంతస్తుష్యంతి దూరాద్ధర్మపరం వరమ్,
ధర్మః కృతః శ్రుతో దృష్టః కథితశ్చింతితోఽపి వా
తథాఽనుమోదితశ్చాపి పుష్ణాతి పరమం శుభమ్." -- ఆశ్వలాయన.

తా:- ధర్మము సరిగా ఆచరింప బడినచో భీకరమగు భయమునుండి రక్షించును. ధార్మిక కృత్యములు చేయువాడు దూరముగా నున్నను వాని చరితమును విని పెద్దలు సంతోషించుచున్నారు. ధర్మమును ఆచరించుట, వినుట, చెప్పుట, చింతించుట వలనను కూడ అధికలాభము కల్గుచున్నది. కనుకనే బుద్ధిమంతులు యథాశక్తి ధర్మము నాచరింపవలెను.

నేను చేసిన ఈ కొద్దిపాటి ధర్మకార్యమును వెలుగులోనికి తీసికొని వచ్చిన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యవర్గమునకు హృదయపూర్వక అభినందనలు.

దే. శేషగిరిరావు